# ఆత్మషట్కము-3

## (శ్రీ శంకరాచార్యులవారు)

శ్లో॥ మత్తో నాన్యత్ కిఞ్చి దత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తు మాయోపక్లుప్తమ్,
ఆదర్శాన్త ర్భాసమానస్య తుల్యం
మయ్యద్వై తే భాతి తస్మాచ్ఛివో౽హమ్॥

తా॥ నాకంటె వేఱుగ ఈ ప్రపంచము ఒకింతైనను లేదు. బాహ్యవస్తువు అద్దమందు ప్రతిబింబించునట్లు సత్యవస్తువు మాయావృతమై అద్వైతరూపుడనగు నాయందు ప్రకాశించుచున్నది. కాబట్టి నేను శివస్వరూపుడను అయియున్నాను.

వ్యాఖ్య:- ఉన్నది ఒకే వస్తువు. అదియే సచ్చిదానంద పరమాత్మ. దానియందీ విశ్వమంతయు మాయచే కల్పింపబడి యున్నది. జాగ్రతుని యందు స్వప్న ప్రపంచమెట్లు స్థితి గల్గియున్నదో, అద్దమందు ప్రతిబింబ మెట్లు ఉనికిని బొందియున్నదో అట్లే ఈ దృశ్య ప్రపంచమంతయు ఆత్మయందు స్థితి గల్గియున్నది. అది కల్పితమై యున్నం దువలన ఆత్మయొక్క అద్వైతత్వమున కేమియు భంగము కలిగింప జాలదు. కావున నేను (ఆత్మ) కేవలము శివ




సంపుటము : 25 జూలై 1993 సంచిక 7

## సంపాదకవర్గము




సంవత్సర చందా : రూ. 30/-లు

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex . 0475 362 ANIL Fax 0866-63017

శాశ్వత చందా : రూ. 300/-లు.

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78


(చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపై యుండును.)

# అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక



**: ముఖచిత్రము :**

ఆశ్రితజన కల్పవల్లీ! జగములేలే తల్లీ! దయామయీ!
కామేశ్వర హృదయరాణీ! శ్రీ బంగారు కామాక్షి అమ్మా!
మాపై నీ చల్లని చూపుల కరుణని కురిపించి కృతార్థులను
చేయుమమ్మా! నమస్తే నమస్తే నమస్తే నమః.



# దైవ ప్రార్థన

నతగ్రీవ సుగ్రీవ సామ్రాజ్యహేతు
ర్దశ గ్రీవసన్తాన సంహారకేతుః
ధనుర్యేన భగ్నం మహత్కామహన్తః
స మే జానకీ జానిరేనాంసి హన్తు.

భక్తుడైన సుగ్రీవునకు సామ్రాజ్యమును ఒప్పగించినవారును, దశ కంఠుడగు రావణుని, అతని వంశమును సంహరించినవారును, శివుని ధనుస్సును విరుగగొట్టినవారును అగు జానకీనాథుడైన శ్రీ రామచంద్రుడు నాయొక్క సమస్త పాపములను ధ్వంసమొనర్చుగాక! శ్రీ రామచంద్ర స్వరూపుడైన అట్టి భగవంతునకు నమస్కారము.

జీవుడు — ఏమండీ 'మాయ' గారూ! తమరెప్పుడు దయచేశారు మా ఇంటికి?
మాయ — తాము పరాకుగా వున్నప్పుడు.
జీవుడు— ఇంకా ఎంతకాలం మా ఇంట్లో వుండ దలంచినారు?
మాయ— తమరు సాగనంపేవఱకు.





**E**ven the least work done for others awakens the power within; even thinking the least good of others gradually instils into the heart the strength of a lion.

ఇతరులకొఱకు చేయు ఒకింత కార్యమైనను జనులలో అంతరంగమున గొప్ప శక్తిని మేలు కొలుపును. ఇతరుల శ్రేయస్సు కొఱకై చేయు ఒకింత ఆలోచన అయినను హృదయములో సింహమువంటి శక్తిని ఉద్భవింపజేయును. ○○

Be holy, trush in the Lord, depend on Him always and you will be in the right track.

పవిత్రులైయుండుడు. భగవంతునియందు పూర్ణ విశ్వాసము కలిగియుండుడు. వారిపైననే నిరంతరము ఆధారపడి యుండుడు. అపుడే మీరు సరియైన పంథాలో పయనించుచున్నవారగుదురు.



# శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



ప్రగతి శీలత్వము (Progress) గంభీర మానవుని స్వభావము. ఎల్లప్పుడు ఒకే స్థితియందుండుట కాతడు ఒప్పుకొనడు. దినదినము ఒక్కొక్క మెట్టు పైకి పోవుచు ఉన్నత శిఖరములనధిష్ఠించవలెనని మనుజుడు సంబరపడుచుండును. తదనుకూలముగ వ్యవహరించునుగూడ. కొందఱు భౌతిక విజ్ఞాన (Science) రంగమున, కొందఱు సాహిత్యరంగమున, కొందఱు రాజకీయ క్షేత్రమున తమ విజ్ఞతను అభివృద్ధిపఱచుకొనుచు ముందునకు పోవుచుందురు. కాని అది చాలదు. నైతిక, ఆధ్యాత్మికరంగములందుగూడ పురోభివృద్ధిని సాధించవలెను.

'డార్విన్' అను పాశ్చాత్య వైజ్ఞానికుని పరిణామవాదము (Theory of evolution) ననుసరించి కోతి క్రమవికాసమునొంది మానవుడుగా మారినదని చెప్పుదురు. కోతి మానవుడగుట అట్లుంచి అసలు ప్రాణి కోతియగుటకు ఎన్ని కోట్ల జన్మల నెత్తియుండునో యోచించుకొనవలెను. ఈ ప్రకారముగ మానవత్వమును బడయుటకు జీవుడు ఎంతటి ప్రయ

త్నము నాచరించెనో, ఎన్ని యోనులందు తిరుగాడెనో, ఎన్ని మజిలీలు దాటెనో గ్రహించుకొనవలెను. ఇదియంతయు అతి దీర్ఘకాలమున జరిగిన పరిణామము కాని ఈ పరిణామము, ఈ క్రమవికాసము ఇంతటితో ఆగరాదు. మానవత్వోపలబ్ధి మాత్రముతో జీవుని వికాసమునకు 'బ్రేక్' (నిలుపుదల) పడరాదు.

వానరుడు నరుడగుట మంచిదేకాని, నరుడు నరుడుగనే ఎల్లపు డుండుట వాంఛనీయము కాదు. నరుడు నారాయణుడు కావలయును. పురుషుడు పురుషోత్తముడై వెలుగవలయును. అంతటితో జీవుని ప్రయత్నము పరిసమాప్తమగును. ఎపుడు మానవుడు మాధవుడగునో, ఇక అతనికి చేయవలసిన కార్యమేమున్నది? సమస్త సాధనలు అచ్చోట అంతమైపోవును. దైవత్వమును బడయుటతో జీవుని క్రమవికాసము పరాకాష్ఠనందుకొనును. అదియే చరమస్థితి. అదియే కైవల్యము. అదియే సంసార బంధవిచ్ఛిత్తి.

పరమానందదాయకమగు అట్టి అనుపమ దైవస్థితిని మోక్షస్థాన మును బడయుటయే జీవుని పరమావధి. ఏకైక లక్ష్యము. అట్టి లక్ష్య మును జేరుటకై ముముక్షువు గొప్ప తపస్సు నాచరింపవలయును. ఇంద్రి యములను చక్కగ నిగ్రహించవలెను. మనస్సును అదుపులోనికి తీసికొని రావలెను. సర్వేశ్వరుని యెడల, సద్గురుని యెడల భక్తిని పెంపొందించు కొనవలెను. ప్రాపంచిక విషయముల యెడల, దృశ్య భోగముల యెడల, క్షణికవిలాసముల యెడల పరిపూర్ణ విరక్తిని సంపాదింపవలెను. మనస్సును బహిర్ముఖ పదార్థముల వెంట పరుగిడనీయక, అరికట్టి, ప్రత్యాహార మొనర్చి అంతర్ముఖముచేసి ఆత్మయందు స్థాపించవలెను.

అయితే బహుజన్మార్జిత దృశ్యవాసనాబలముచే మనస్సు శీఘ్రముగా లొంగదు. అందులకు శిక్షణ *(Spiritual Discipline)* చాల అవసరము. కొన్ని నియమములు, కొన్ని వ్రతములు, కొన్ని సాధన పద్ధతులు అవ లంబించి అకుంఠిత దీక్షతో వానిని కార్యాన్వితమొనర్చుటకై యత్నింప

వలెను. మన పూర్వీకులందువలననే ఏకాదశి వ్రతము, మౌనవ్రతము, కార్తీకవ్రతము, మాఘవ్రతము, చాతుర్మాస్యవ్రతము మున్నగు వ్రతములను సృష్టించి వానిని దీక్షతో కొనసాగించినచో మనస్సుపై గొప్ప విజయమును సంపాదించవచ్చునని బోధించిరి.

అట్టి వ్రతములలో చాతుర్మాస్యమొకటి. దానిని గూర్చి ప్రస్తుతమొకింత విచారించెదము. ఈ వ్రతము ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు ప్రారంభమగును. దానినే 'తొలిఏకాదశి' అనియు 'శయనైకాదశి' అనియు అందురు. శ్రీ విష్ణుభగవానుడు ఆ దినమున యోగనిద్రయందు ప్రవేశించును గావున దానికి శయనైకాదశియని పేరు వచ్చినది. ఆ ప్రకారము విష్ణువు యోగనిద్రయందు నాలుగు మాసములు వుండి, మఱల కార్తీక శుద్ధ ఏకాదశినాడు లేచునుగావున ఆ దినమునకు 'ఉత్థానైకాదశి' అని పేరు వచ్చినది. కావున ఈ నాలుగు మాసములు (చాతుర్మాస్యకాలము) అతి పవిత్రమైన సమయము. వాతావరణమున్ను అవుడు చాల చల్లగా నుండును కావున ధ్యానమునకు చాల అనుగుణ్యముగా నుండును. అందుచే ముముక్షువు లాసమయమున తీవ్రతర సాధనలను గావింపవచ్చును.

పూర్వకాలమున సాధువులు, సన్యాసులు కొంతకాలమేకాంతమున చక్కగ తపస్సు నాచరించి, నియమనిష్ఠలుగలవారై, పరమార్థానుభూతిని బడసి తదుపరి దేశమున సంచారమొనర్చుచు గృహస్థులు మున్నగువారికి ఆధ్యాత్మిక బోధలను గావించుచుండిరి.

ఈ నాలుగు నెలలు వర్షాకాలము, చలికాలము అగుటచే సంచారమునకు ప్రతిబంధకముగా నుండుటవలన వారు తమ ప్రయాణములను విరమించి ఎక్కడో ఒకచోట నిలుకడగ నున్నవారై అచటి జనులకు దైవతత్త్వమును ప్రబోధించుచుండెడివారు. అదియే చాతుర్మాస్యకాలము. చాతుర్మాస్య వ్రతమును సాధు, సన్యాసులే కాక గృహస్థులు, బ్రహ్మచారులున్ను అవలంబించవచ్చును. కాని ఎవ్వరైనను ఈ నాలుగు నెలలు బయటి సంచారమును

విరమించి ఒకేచోట చక్కగ భగవద్ధ్యానాదులను గావింపవలయును.

ఈ చాతుర్మాస్యమునందు ఏమి చేయుదురు? ఏమి చేయవలెను? అనునది ఒక ప్రశ్న. చాతుర్మాస్యమొక వ్రతము. ఒకరోజు రెండు రోజులతో గూడిన వ్రతముకాదిది; దీర్ఘకాలిక వ్రతము. ఈ వ్రతము నాచరించువారు ఎక్కడికిని వెళ్లక దీక్షతో ఆధ్యాత్మిక సాధనలను అమలుపఱచుచుందురు. భగవత్తత్త్వ విచారణయందే కాలముగడుపుదురు. కాలమును వృథాచేయరు. ఏదియో యొక పరమార్థ కార్యమును చేయుచుందురు.

బోధనాశక్తిగలవారు ఇతరులకు ప్రబోధించుచుందురు. కొందరు ఈ నాలుగు నెలలు కొన్ని నియమములు పెట్టుకొందురు. కొందరు ఆహార సంయమము కావించుదురు. కొందరు పప్పులో ఉప్పు మానివేయుదురు. మఱికొందరు పాలలో చక్కెర మానివేయుదురు. మఱికొందరు కొన్ని రకముల కూరలను వదలుదురు. ఇదియంతయు జిహ్వేంద్రియ సంయమము కొఱకై ఏర్పడినది. అయితే ఇది చాలదు ఆహారాది నియమములతోబాటు ఈ క్రింది విషయముల యెడల గూడ జాగ్రత్త వహించవలెను— కోపము రానీయగూడదు. బ్రహ్మచర్యమును శీలించవలెను. తన హృదయమను బిలమును బాగుగ పరిశోధించుకొని అసూయ, ద్వేషము, మున్నగు విషసర్పము లేవైన అందు కాపురముండుచున్నవేమో చూచి, ప్రయత్నపూర్వకముగ వానిని బయటకు గెంటివేయవలెను. భగవద్భక్తిని, గురుభక్తిని బాగుగ పెంపొందించుకొనవలెను.

ప్రతి దినము ఒక అష్టోత్తరము (108)నకు తక్కువ లేకుండా ఏదైన దివ్యమంత్రమును (పంచాక్షరి, అష్టాక్షరి మున్నగు వానిని) జపించుటయు చాలా శ్రేష్ఠము. తీరికగా ఉన్నప్పుడు రామ నామమునుగాని, కృష్ణ నామమునుగాని, శివనామమునుగాని, విఠల్ నామమును గాని లిఖించవచ్చును. వెయ్యేల, ఏదియో యొక దైవకార్యముచే మనస్సునకు బహిర్ముఖ ప్రవృత్తి తగ్గించి విషయచింతనకు అవకాశమే లేకుండ చేయవలయును. పలువురు

చేరుటకు వీలున్నచో సమష్టి భజనయు ఏర్పాటు చేయవచ్చును. లేక వ్యక్తిగతముగానైన సంకీర్తనాదులను గావించుకొనవచ్చును.

ఈ ప్రకారముగ చాతుర్మాస్యకాలము నాలుగు నెలలును వ్రతనిష్ఠునకు దైవవాతావరణమునందే గడచిపోవును. దాని ఫలితమిక చెప్పతరమా? వ్రతము పూర్తియగునరికి సాధకుడు బోలెడు పుణ్యమును సముపార్జించును. ఇదియంతయు జీవుని లక్ష్యసాధనకు అనగా బ్రహ్మసాక్షాత్కారమునకు మిక్కుటముగ ఉపకరించును.

ఈ సందర్భమున ఒక విషయమును సర్వులును జ్ఞాపకమునందుంచుకొనవలెను. అది యేదనగా, ఈ వ్రతములు, జపములు, తపములు వాస్తవముగ ఏదియో యొక కాలమునకు పరిమితములైయుండలేదు. సామాన్యునకు మోక్షమార్గమున ఆసక్తిని జనింపజేయుటకే ఈ పరిమితకాల వ్రతాదులేర్పడినవి కాని, యథార్థముగ దైవధ్యానమందు, తత్త్వవిచారణ యందు కాలనిర్ణయమేమియు లేదు. జనులు ఒక చాతుర్మాస్యమునందే కాదు, ఎల్లకాలములందును పరమార్థ సాధనలను గావింపవచ్చును. 'తస్మాత్సర్వేషు కాలేషు—మా మనుస్మర' అని గీతయందు భగవానుడు చెప్పనే చెప్పిరి. తీవ్రతర ముముక్షువులెల్లపుడును 'ద్వాదశ మాస్య వ్రతములనే ప్రతి సంవత్సరం నాచరించుచుందురనుటలో సందేహములేదు. అనగా వారు నిరంతరము అధ్యాత్మ క్షేత్రమందే కాలము గడుపుచుందురు. అట్టి స్థితికి ఎగబ్రాకుటకై ప్రతివారును యత్నించవలెను.

అయితే ప్రారంభమున చిన్న చిన్న వ్రతములనారంభించి, క్రమముగ ఊర్ధ్వస్థితిని బడయవచ్చును. ఇట్టి చాతుర్మాస్యాది వ్రతములు జనుల హృదయాంతరాళములను పరిశుద్ధపఱచి, ఆత్మసాక్షాత్కారమను మహోన్నత శిఖరమునధిరోహించుటకై చాల సహాయపడును కావున ముముక్షువులు వానినవలంబించి చిత్తశుద్ధిని బడసి భగవత్కృపకు పాత్రులై తమ తమ జీవితములను ధన్యమొనర్చుకొందురుగాక!!

ఓం తత్సత్ ○○

## శ్రీ డాక్టరు వి. కేసరీహనుమాన్ గారు M.A.,M.Ed., Ph.D.
## (సికింద్రాబాద్)

1. దైవస్వరూపము పొందాలంటే
బాగుగ సాధనజేయుమురా
దైవగుణంబులు సాధించుచునే
దైవత్వమును పొందుమురా ||దై||

2. నిర్భయత్వమును సాధించినచో
మనసుకు శాంతి లభించునురా
హృదయ పవిత్రత కాపాడినను
హృదయానందము కలుగునురా||దై||

3. ఇంద్రియములను వశపరచుకొని
త్యాగబుద్ధిని పెంచుమురా
జ్ఞానయోగమును సాధించుచు నీవు
పరమావధిని పొందుమురా ||దై||

4.స్వాధ్యాయము నీవు నిత్యము జేయుచు
ఆత్మశక్తిని పొందుమురా
సత్యధర్మముల సాధించుచునే
సత్యలోకమున నుండుమురా ||దై||

5. అహింసామార్గమును అవలంబించుచు
కోపతాపములు మానుమురా
దుర్గుణాలను దూరము జేయుచు
ప్రేమ మార్గమున నడువుమురా||దై||

6. పేదలపట్ల జాలి జూపుచు
దయాగుణమును పెంచుమురా
దానధర్మములు జేయుచు నీవు
దైవత్వమును పొందుమురా ||దై||

7. అజ్ఞానమును అసుర భావమును
ఆత్మజ్ఞానముచె వదులుమురా
కామక్రోధ మదమాత్సర్యములను
త్యాగబుద్ధిచే విడ్చుమురా ||దై||

8. గర్వభావమును వదలిపెట్టితే
ద్వేషభావము పోవునురా
ఘడియలో ప్రాణం పోయే జీవికి
గర్వము ద్వేషము ఎందుకురా ||దై||

9. చిత్తము చపలము కాకుండుటకు
దైవనామము దలచుమురా
అంతరాత్మను ఆరాధించుచు
ఆత్మానందము పొందుమురా ||దై||



**Look upon everyone as God.**
**ప్రతి ప్రాణిని దైవస్వరూపముగ వీక్షింపుడు.**

# రామాయణ సుధ

విజ్ఞానముతోగూడి ఇతరుల చేష్టలద్వారా వారి మనోభావములను తెలిసికొన వలెను. మఱియు దానిననుసరించి ఆవశ్యక కార్యములన్నిటిని చేయవలెను బుద్ధి బలమును ఆశ్రయించని రాజు ప్రజలందఱిపైన శాసనము చేయజాలడు

గుణబుద్ధిచేగాని, దోషబుద్ధిచేగాని జీవునిచే చేయబడిన కర్మలే అతనికి సుఖ దుఃఖరూపఫలములను చేకూర్చుచుండును. పరలోకమునకేగి ప్రతి జీవియు శాంత ముగ తనయొక్క సమస్త శుభ, అశుభ కర్మలయొక్క ఫలమును అనుభవించుచుం డును ప్రాణుల జననమరణములకు నిశ్చిత సమయము లేదు. కావున శుభకర్మలనే జీవుడు చేయవలయును

అవివేకపూర్ణమగు కార్యమునొనర్చు దూతయొక్క చేతిలోపడి దేశకాలముల విపరీతవ్యవహారము సంభవించుటవలన అనేకసార్లు మంచి కార్యములు కూడ సూర్యోదయముచే అంధకారమువలె నశించిపోవును రాజు, మంత్రులు వీరి ద్వారా నిశ్చయింపబడిన కర్తవ్యా కర్తవ్య విషయక విచారణయు ఒకానొక అవివేకియైన దూతయొక్క ఆశ్రయము గైకొనుటవలన సాఫల్యమును పొందకుండును. తన్ను పండితునిగ తలంచు అవివేకియగు దూత కార్యమునంతను బూడిదపాలు చేసివేయును

హతాశుడుకాక ఉత్సాహముతో గూడియుండుటయే సంపత్తికి మూలకారణము ఉత్సాహమే పరమసుఖమునకు హేతువైయున్నది. కావున కార్యసిద్ధికై మరల మరల ప్రయత్నించవలెను. ఉత్సాహమే ప్రాణులను సదా సర్వకర్మలందును ప్రవృత్తము చేయును. అదియే వారుచేయు కర్మలందు వారికి సాఫల్యము నొనగూర్చును.

ఏ మహనీయులు తమయందు లేచిన కోపమును తమ బుద్ధిచే ప్రజ్వలించు అగ్నిని జలముచే జల్లార్చునట్లు-శమింపజేసికొందురో, వారే ఈ ప్రపంచమున ధన్యులు. క్రోధముతో నిండియున్నపుడు ఎవడు పాపము చేయకుండును? క్రోధ

(శ్రీ శంకరాచార్యులవారు)

శ్రీ శంకర భగవత్పాదులు శివునిగూర్చి ఇట్లు ప్రార్థించిరి–'ఓ పరమశివా! ఆదిభిక్షూ! తాము భిక్షాటనమునకు వెళ్లునపుడు ఊరక వెళ్లుటకంటె తమవెంట ఒక కోతిని తీసికొని వెళ్ళినచో తమకు బాగుగ ఉపయోగపడును (సామాన్యముగ ఇళ్లకు భిక్షాటనమునకు వచ్చువారు కొందరు కోతిని వెంటతెచ్చి ఆడింపుచుందురు).

అయితే మహాప్రభూ! ఆ కోతి కొఱకై తాము ప్రయత్నము చేయనక్కఱలేదు. నా దగ్గఱనే వున్నది. దానిని తమకు సమర్పించెదను. దాని మూల్యమును తమరు చెల్లింపనక్కరలేదు ఉచితముగా తమకిచ్చెదను. నాకు దానితో పెద్ద బాధగా ఉన్నది. తాము తీసికొనినచో తమకది భిక్షాటనమున ఎంతయో ఉపకరించగలదు. నాకును దాని బెడద తప్పిపోగలదు

దేవా! ఆ కోతి నా మనస్సే అది మహాచపలముగా నున్నది నాకు దానితో పెద్దబాధ ఏర్పడినది కావున భక్తి అను త్రాటిచే గట్టిగ కట్టివేచి దానిని తమ పాదపద్మములచెంత వదలివేయుచున్నాను. మహాప్రభో స్వీకరింపుడు!

(ముముక్షువు తన చిత్తమును భగవంతునకు సమర్పించి పరమభక్తి యుతుడై మెలగవలెనని శ్రీ శంకరులు పై శ్లోకముద్వారా వెల్లడించుచున్నారు )

క్రోధమునకు వశుడైనవాడు గురువులకు కూడ అపకారము చేయగలడు క్రోధియగువాడు సాధుజనులను కూడ ఆక్షేపించును. ఎక్కువ కోపము కలవాడు నోటితో ఏమి పలుకవలెను, ఏమి పలుకగూడదు– అను విషయమును ఎన్నడును విచారింపడు. క్రోధి చేయజాలని చెడ్డపని ఏదియు లేదు. మఱియు చెప్పజాలని చెడ్డమాట ఏదియు లేదు. ఎవడు తన హృదయమందు జనించిన కోపమును–పాము తన కుబుసమును వదలివేయునట్లు–క్షమాగుణముచే (ఓర్పుచే) వదలివేయునో, అట్టివాడే మనుజుడని చెప్పబడును.



.. సీతారాం సీతారాం । సీతారాం జయ సీతారాం
శ్రీహరి మాధవ సీతారాం । సింధువిహారా సీతారాం
పాహి పాహి సీతారాం । పన్నగశయనా సీతారాం
సురవరసన్నుత సీతారాం । సూర్యకులాన్వయ సీతారాం
దశరథనందన సీతారాం । దానవమర్దన సీతారాం
యజ్ఞపాలకా సీతారాం । యతిజన వందిత సీతారాం
శివచాపహరా సీతారాం । గుహసంపూజిత సీతారాం
శాశ్వతగుణగణ సీతారాం । శబరీపూజిత సీతారాం
జటాయుపాలిత సీతారాం । సద్గతిదాయక సీతారాం
వాలినిగ్రహ సీతారాం । వారధిబంధన సీతారాం
రావణసంహర సీతారాం । రాక్షసమర్దన సీతారాం,
సీతాలోలా సీతారాం । శ్రితజనపాలక సీతారాం
ముక్తిదాయకా సీతారాం । మునిజనవందిత సీతారాం
పశుపతి వందిత సీతారాం । పాపధ్వంసక సీతారాం
పావననామా సీతారాం । పతితపావనా సీతారామ్.

2. శ్రీరామ రామ రామా । సీతామనోభిరామా!
కారుణ్యధామ రామా । కల్యాణనామ రామా!

3. రామ రామ సీతారామ । మేఘశ్యామ మంగళధామ
మేఘశ్యామ మంగళధామ । రఘురామ రాజలలామ
పావననామ పాపవిరామ । జానకిరామ జయరామ
రవికులసోమ రణతలభీమ । శివనుతనామ శ్రీరామ.

4. సీతారామ శ్రీరఘురామ । దాశరథే శ్రీరఘురామ
ఆత్మారామ ఆనందధామ । పావననామ పరంధామ.

5. దశరథనందన రామా రామా । దయాసాగర రామా రామా
దశముఖమర్దన రామా రామా । దైత్యకులాంతక రామా రామా
పశుపతి రంజన రామా రామా । పాపవిమోచన రామా రామా
లక్ష్మణసేవిత రామా రామా । లక్ష్మీ మనోహర రామా రామా
సూక్ష్మస్వరూప రామా రామా । సుందరవదన రామా రామా.

OO

# శ్రీ రామతీర్థస్వామి

1. ఆత్మ స్వాతంత్ర్యమునొంది విముక్తిని బడసిన మనుజునియెడల ప్రకృతియంతయు విధేయతను జూపును సమస్త ప్రపంచము అట్టివాని ముందు వంగి నమస్కరించును. నేను ఆ పరమాత్మ స్వరూపుడను; నీవును ఆ పరమాత్మ స్వరూపుడవే. మనమెల్లరము వాస్తవముగ ముక్తులమే. ఈ విషయమును జనులీనాడు గమనించినను, గమనించకపోయినను అత్యంత యథార్థమై యున్నది. దానిని ఏనాటికైనను అందఱును అనుభూతమొనర్చుకొని తీరవలసినదే

2 రామతీర్థుడు నీ వెంతకు ఒక మతమును గొనివచ్చుచున్నాడు. ఆ మతము వీధులందు దొఱకును. ఆకులపై వ్రాసియుండును. సెలయేళ్ళలో ధ్వనించుచుండును. గాల్పులందు శబ్దము చేయును నీ రక్తనాళములలో, నరములలో కదలుచుండును నీ నిత్యవ్యవహారమునకు సంబంధించి యుండును ఆ మతమును నీవు నీ దైనందిన జీవితములో అభ్యాసము చేయవలసియుండును. దానిని నీ ఇంటియందును, నీ భోజనశాలయందును, ఎల్లెడలనుగూడ ఆచరణయందుంచవలసియున్నది.

3. అహంభావమును పారద్రోలినపుడు విశ్వమంతయు నీ శరీరమే కాగలదు. అత్తటి నీవేది భావించినను, ప్రపంచమంతయు నీతో కలిసివచ్చును. నీవు బయలుదేటినచో దేశము నీ వెనువెంట రాగలదు. OO

It is ...

evil. So remove it.

**దుఃఖమును కలుగజేయునది, పతనమునకు హేతుభూతమైనది భయమొకటియే. కాబట్టి దానిని తొలగించివేయుడు.**

# ఓంప్రకాశ్

ఎవరైనా, ఏదయిన కఠిన విషయాన్ని, చక్కగా అర్థం అయ్యేలా వివరిస్తుంటే, "అరటిపండు వొలిచి పెట్టినట్లు" ఎంత సుళువుగా చెబుతున్నారో అంటాం. అరటి పండు పైకి చాలా కఠినంగా వున్నట్లు కనబడుతుంది కాని దాని తోలు ఒలిచేందుకు పూనుకోగానే దాని మృదుత్వం బయటపడుతుంది. దాన్ని గొంతులో వేసుకుంటే, దాని మధురత్వం తెలుస్తుంది అది ఎంత సుళువుగా కడుపులోకి దిగజారుతుందో అర్థమవుతుంది దైవసృష్టిలో ఇలాంటి వింత అనుభవాలు అనేకం కదా!

ఈ అరటిపళ్లకు మన భారతదేశమే పుట్టిల్లు అరటిపళ్లలో చాలా రకాలున్నాయి. కర్పూర చక్కెరకేళీ, చక్కెరకేళీ, అమృతపాణి, మలైవాలా, కొమ్ము అరటి, మలబారు అరటి, పచ్చ అరటి, బొంత అరటి, కూర అరటి, ఎఱ్ఱ చక్కెరకేళీ మొదలగు రకాలు కనబడుతుంటాయి. అరటిపండు సంవత్సరమంతా దొరుకుతూనే వుంటుంది.

అరటిపండులో అధిక ఆహార విలువ వుంది. ఈ పండులో 61.4% తేమ; 1.3% మాంసకృత్తులు; 0.2% క్రొవ్వు; 0.7% సేంద్రియ లవణాలు; 36.4% పిండి పదార్థాలు వున్నాయి. విటమిన్ 'ఎ' ఈ పండులో ఎక్కువగా వుంటుంది విటమిన్ 'సి' కూడా తగినంతగా వుంటుంది.

100 గ్రాముల బరువున్న అరటిపండులో సోడియం 1.2 మిల్లీగ్రాములు; పొటాషియం 34.8 మిల్లీగ్రాములు; మెగ్నీషియం 41.9 మిల్లీగ్రాములు; రాగి 0.16 మిల్లీగ్రాములు; గంధకం 13 మిల్లీగ్రాములు; క్లోరిన్ 78.5 మిల్లీగ్రాములు వుంటాయి. ఇందులో క్షారవర్ధక సేంద్రియ లవణాలు ఎక్కువగా వుంటాయి; ఆ కారణంగా అవి దేహంలోని ఆమ్లాలను ఆకర్షించి, దేహాన్ని ఆరోగ్యవంతం చేస్తాయి.

# [illegible]

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

*నాకంటె వేఱుగ ఏదేని ఉండునేని అది ఎండమావులవలె మిథ్యయే యగును. గొడ్రాలి కొడుకు మాటయందు భయము కలుగునా?* ○○

---

అరటిపండు క్రిమిసంహారిణి ప్రేవులలోని క్రిములను నాశనం చేస్తుంది మలబద్ధకాన్ని నివారిస్తుంది. పచ్చి అరటికాయ కూర నీళ్ల విరేచనాలను తగ్గిస్తుంది తగు మాత్రం అరటిపండును జీర్ణాశయంలో వ్రణాలు గలవారు తిని, అరిగించుకోగలరు.

బాగా పండిన అరటిపండును పాలలో పిసికి, చక్కగా కలిపి చిన్నపిల్లలకు త్రాగించాలి; పాలు తేలికగా జీర్ణం అవుతాయి బరువుకూడా పెరుగుతుంది పిల్లలలో పెరుగుదల కనబడుతుంది అరటిపండును చక్రాలుగా కోసి, ఎండబెట్టితే, అవి నిలువ వుంటాయి. పచ్చి అరటికాయలను కోసి, పిండిగా చేసి, ఎండబెట్టి, రొట్టెలుగా చేసు కుని తినవచ్చు. అవి తేలికగా జీర్ణం అవుతాయి. జీర్ణాశయరోగులు కూడా తినవచ్చు.

అరటిపువ్వును, దూటను కూరగా వండుకొంటారు. అరటి ఆకులను విస్తళ్లుగా, పశువులకు మేతగా వాడతారు. అరటి బొందనార కాగితపరిశ్రమలో పనికి వస్తుంది. అరటి తొక్కలను ఎండించి, కాల్చి ఆ భస్మాన్ని సబ్బుగా కూడా ఉపయోగిస్తుంటారు.

అరటిపండు మీద చిన్న చిన్న నల్లని మచ్చలు కనబడితే, అవి బాగా మాగిన పండ్లని తెలుసుకోవాలి. ఆ పక్వదశలోనే వాటిని తినాలి. అప్పుడే వాటిలో పిండి పదార్థం, చక్కెరగా మారి వుంటుంది బాగా పండిన అరటిపండును తింటే, అందు లోని పిండిపదార్థం తేలికగా జీర్ణం అవుతుంది.

అరటిపండు తుష్టిని-పుష్టిని ఇచ్చే మధురఫలం. దీనిని ఆబాలగోపాలం అం దరూ తినవచ్చు, జీర్ణం చేసుకోవచ్చు. అరటిపండు కూడా అమృతఫలమే.

కాబట్టి ప్రతి ఇంటి పెరటిలో, ఒక అరటిచెట్టు వుండటం ఆరోగ్యదాయకం. ప్రతిరోజు అరటిపండును సేవించటం ఆరోగ్యప్రదం. ○○





**మం**చిని గ్రహించుటతోపాటు చెడ్డనుగూడ వదలివేయుచుండవలెను మనుజునకు సద్వస్తు పరిగ్రహమునందెంతటి అభినివేశముండునో, **దుష్టవస్తు పరిత్యాగము** నందును అంతటి తీవ్రాసక్తి యుండవలెను. శరీరము ఆరోగ్యముగ నుండవలెననిన పుష్టికరమగు ఆహారమును లోనికి వేయుచుండవలెను జీర్ణింపగా మిగిలినట్టి మలమూత్రాదులను బయటకు పొగనంపుచుండవలెను

ఈ రెండు క్రియలున్ను జరుగవలెను అట్లుగాక గ్రహణముతోబాటు త్యాగము సంభవింపనిచో శరీరము క్రుళ్ళి శిథిలమై పోగలదు శరీరమున ఈ ద్వివిధ కార్యములెట్లు నెరవేర్పబడుచున్నవో, బయట గృహమందును అట్లే జరుగుచున్నవి.

త్రాగుటకు, వంట చేసికొనుటకు ఎక్కడనుండియో ఒకటి రెండు బిందెలు మంచినీరు తెచ్చుకొనుచుందురు గృహిణులు అట్లే ఇంటియందలి మురికినీటిని గట్టర్లద్వారా బయటకు త్రోసివేయుచుందురు ఈ రెండు కార్యములు జరిగినపుడే ఇల్లు పరిశుభ్రముగను, ఒళ్ళు ఆరోగ్యముగను వుండును

తేళ్ళను, పాములను, ఎలుకలను, ఎవరును తమ ఇంటిలో నుంచుకొనరు. వాటిని ఇంటియందు చూచినచో, ఇక తరిమివేయువఱకు, లేక చంపువఱకు ఒంటికాలిమీద నిలబడుదురు. ఎక్కడో అతి దూరముననున్న అరణ్యమునుండి ఒక జింకనో, నెమలినో, రామచిలుకనో తెచ్చుకొని సాకుచుందురు

ఆ ప్రకారముగనె ఈ శరీరమునందు అమృతత్వ (మోక్ష) సంపాదనకు వలసిన పరికరములను చేర్చుకొనుటతోబాటు, మృత్యురూప సంసార దుఃఖసాగరమున బడద్రోయునట్టి దుష్ట ప్రవృత్తులను పారద్రోలవలెను.

వీనికే గీతాచార్యుడు **ఆసురీ సంపద**యను పేరు పెట్టి అద్దానిని విమోచనము గావింపవలసినదిగా నాదేశించెను.

[illegible]
[illegible]

1) విషయాసక్తి, 2) ప్రజ్ఞామాంద్యము,
3) కుతర్కము, 4) విపర్యయము, 5) దురాగ్రహము–ఇవి జ్ఞాన ప్రతిబంధకములు.

సర్పవిశేషము. దీని తోకయందు ఉత్పల (కలువ) చిహ్నము వుండును. (దేవదానవులు) ఈ సర్పముతోనే క్షీరసాగరమునందు మందర పర్వతముతో మథించిరి.

అను వ్రతము భాద్రపద శుద్ధ పంచమినాడు సప్తర్షులను ఉద్దేశించి చేయబడును.

27 కలవు. అవి 1) గార్హపత్యము, 2) ఆహవనీయము, 3) దక్షిణము, 4) నిర్మంథ్యము, 5) వైద్యుతము, 6) శూరము, 7) సంవర్తము, 8) లౌకికము, 9) జాఠరము, 10) విషకము, 11) క్రవ్యాత్తు, 12) క్షేమవంతము, 13) వైష్ణవము, 14) దస్యుమంతము, 15) బలదము, 16) శాంతము, 17) పుష్పము, 18) విభావసువు, 19) జ్యోతిష్మంతము, 20) భరతము, 21) భద్రము, 22) శిష్టకృత్తు, 23) వసుమంతము, 24) క్రతువు, 25) సోమము, 26) పితృమంతము, 27) అంగిరస్సు.

'ఓమ్ నమో నారాయణాయ' అనునది అష్టాక్షరీ మంత్రమని చెప్పబడును. మరియు 1) అకారము, 2) ఉకారము, 3) మకారము, 4) బిందువు, 5) నాదము, 6) కళ, 7) కళాతీతము, 8) తత్పరము–అను ఎనిమిదింటికి అతీతముగ ఉండుటచే 'ఓమ్' అను ప్రణవమున్ను అష్టాక్షరీ మంత్రమని చెప్పబడును.

OO

'ప్రతి జీవియందును అమృతస్వరూపమగు ఆత్మయు, మృత్యురూపమగు ప్రకృతి (మాయ) యు కలవు. సత్యముచేతను, దైవిక గుణముల చేతను అమృతత్వము సాధింపబడును. అసత్యము చేతను, ఆసురిక గుణము చేతను మృత్యువు సాధింప బడును'– అని శాస్త్రములు హెచ్చరిక చేయుచున్నవి.

కావున మృత్యుదాయకములును, మోక్ష ప్రతిబంధకములునగు ఈ రాక్షస గుణములకు సాధ్యమైనంత త్వరలో జీవుడు ఉద్వాసన చెప్పవలయును అనగా దైవీసంపదకు సన్మానము (Welcome), ఆసురీ సంపదకు వీడ్కోలు (Send off) ఏర్పాటు చేయవలసియుండును.

OO

# ఆధ్యాత్మిక కథలు

ఒకానొక గ్రామమున ఒక సాధువు చిన్న కుటీరమును ఏర్పాటు చేసుకొని ధ్యానాది సాధనలు గావించుకొనుచుండెను కొంతకాలమునకు ఒక యువకుడు ఆ సాధువును చేరి అతనికి సపర్యలు చేయసాగెను.

ఒకనాడా సాధువు పుణ్యక్షేత్ర దర్శనార్థము దూరప్రాంతమునకు పోవుటకు నిశ్చయించుకొనెను అతని వెంట యువకుడైన శిష్యుడు కూడ బయలుదేరెను.

మార్గమధ్యమున వారు అనేక గ్రామములను, పట్టణములను దాటి వెడలుచుండిరి. ఒకపుడు వారు ఒక రాజ్యములోనికి ప్రవేశించి అందలి ముఖ్యపట్టణమును చేరిరి. ఆ నగరములో అనేక విలాసవస్తువులను, భోగ్యపదార్థములను చూచిన శిష్యునకు వాటిని పొందవలెనను కాంక్ష ప్రబలినది. ఆ విషయమై సాధువు గారితో సంప్రదించగా, "నాయనా! ఈ ప్రాంతము భోగభూమి కాదు, రోగభూమి; ఇది ఒక అజ్ఞానపురము నేడు ఇచట అను కూలముగ వున్న పరిస్థితులు మరునాటికి తారుమారై నీకు అపకారము కలుగవచ్చును. ఇక్కడి రాజు, మంత్రులు వివేకవంతులు కారు. నా మాట ఆలకించి ఈ ప్రాంతమును త్వరగా విడిచివెళ్ళుదము, నా వెంట రమ్ము" అని సాధువు శిష్యునకు బోధించెను.

ఆ మాటలు శిష్యునకు రుచించలేదు. ఎంత చెప్పినప్పటికిని విననందున సాధువు శిష్యుని వదలి తాను ముందుకు వెడలిపోయెను.

పిమ్మట శిష్యుడు ఆ నగరమందలి ధర్మసత్రమునందు ఒక గదిని

కుదుర్చుకొనెను ప్రతిరోజూ ఉదయమే బయలుదేరి కొద్దిమంది ధనవంతుల వద్దకెళ్ళి బాగుగా ధనమును సంపాదించుకొని తిరిగివచ్చుచుండెను ఆ ధనముతో అతడు ఆ రాజనగరులోని రుచికరములైన నేతితో చేయబడిన తినుబండారములను కొని పుష్టిగ ఆరగించుచు, అచటి విలాస ప్రదేశములందు యధేచ్ఛగా తిరుగసాగెను క్రొవ్వు పదార్థములను బాగుగ తినుటవలన కొన్ని దినములకు అతడు స్థూలకాయుడయ్యెను.

ఇట్లుండ ఒకనాడు ఒక వ్యక్తి రాజమార్గముగుండా పోవుచుండెను నూతనముగ నిర్మించబడిన ఒక ఇంటి యొక్క గోడ ఒకటి విరిగి ఆ వ్యక్తిపై పడుటవలన ఆ బాటసారికి తీవ్రముగ గాయములైనవి అతడు నేరుగా రాజుగారిని సమీపించి ఫిర్యాదుచేసెను.

అపుడు ఆ రాజు మరియు అతని మంత్రులు వివేకరహితముగ విచారణ నిర్వహించుటకు పూనుకొని ఆ ఇంటి యజమానిని సభకు పిలిపించి-"ఓయీ నీ వలననే ఈ బాట సారికి దెబ్బలు తగిలినవి కావున నీకు ఉరిశిక్ష వేయుచున్నాము నీ సంజాయిషీ ఏమిటి?" అని ఆజ్ఞాపించిరి ఆ యజమాని వణుకుచు "రాజా! మన్నింపుడు ఇందు నా దోషమేమియు లేదు. ఆ గోడను నిర్మించిన తాపీవానిదే తప్పు" అని ప్రత్యుత్తరమిచ్చెను

వెంటనే రాజు తాపీవానిని పిలచి "ఓయీ! నీవు గోడను సక్రమముగ నిర్మించనందున నీకు ఉరిశిక్ష వేయుచున్నాను" అని ఆదేశించెను. ఆ తాపీవాడు కొంచెము వృద్ధుడు. అతనికి రాజుయొక్క, మంత్రులయొక్క తెలివితేటలు బాగుగ తెలిసియుండుటవలన వారికి ఇట్లు సమాధానము చెప్పెను-"ఓ రాజా! తప్పు అంతయు సున్నములో కలుపుటకు నీళ్ళు తీసుకొనిరావలసినవానిది. అతడు వేళకు నీరు తీసుకొనిరాలేదు కావున అతనిని శిక్షింపుడు"

అంతట రాజు సేవకులను పంపి, నీరు మోయు కూలిని రప్పించి, "ఓ కూలీ! నీ వలన బాటసారికి ఇబ్బంది కలిగినది. కనుక నీకు మరణ

దండన విధించుచున్నాను" అని ఆజ్ఞ జారీచేసెను అపుడా కూలీవాడు గడగడ వణకుచు–"మహారాజా! గోడను నిర్మించునపుడు సరియైన వేళకు కొళాయిలో నీరు రాలేదు. ఆ పిదప చిల్లిపడిన తోలు తిత్తిలో నీటిని తెచ్చుచుండగా మార్గమునందలి గృహములో ఒక వేశ్య రాగయుక్తముగ పాడుచుండెను నాకు సంగీతమనిన ఇష్టము నేను ఆ పాట వినుచుండగ తిత్తిలోని నీరంతయు కారిపోయినది కావున దోషమంతయు ఆ వేశ్యదే" అని పలికి మిన్నకుండెను.

రాజుగారికి భోజనసమయము ఆసన్నముగుటవలన త్వరత్వరగా న్యాయవిచారణ పూర్తిగావించవలెనని నిర్ణయించుకొని ఆ వేశ్యను ఆస్థానమునకు పిలిపించెను. బాటసారి గాయములకు కారణమైనది గావున ఈమెను వెంటనే ఉరితీయవలసినదిగా మంత్రులను రాజు ఆదేశించి వెడలిపోయెను. ఆమె ఏమియు దిక్కుతోచక అటులనే నిలబడిపోయెను రాజుగారు చక్కటి తీర్పును ఒసంగినారు అని మంత్రులు, అధికారులు సంతోషించుచు, ఆమెను తలారులకు ఒప్పగించి, వారును స్వగృహములకు నిష్క్రమించిరి.

అటుపిమ్మట ఆ మధ్యాహ్న సమయమున తలారులు ఆ వేశ్యను ఉరితీయుటకు ఒక త్రాడు తీసుకొనివచ్చిరి. ఆ త్రాడు లావుగ, వదులుగ ఉండెను. కాని ఆ వేశ్య యొక్క మెడ సన్నముగ ఉండుటవలన వారికేమియు తోచక రాజువద్దకు పరిగిడిరి.

వెంటనే రాజు– "నన్ను విసిగించకుడు. ఉరిత్రాడు వదులుగా ఉన్నచో, దానికి సరిపోవు లావు మెడగల వానిని వెతికి తెచ్చి వానిని ఉరితీయుడు" అని చెప్పి వారిని పంపివేసెను

అట్లే వారు నగరములో వెతకుచు, అపుడే సుష్టుగ భోంచేసి ధర్మసత్రము వరండాలో హాయిగా కూర్చునియున్న శిష్యుని గమనించిరి. క్రొవ్వుపదార్థములను మితిమీరి తినియుండుటవలన అతని మెడ లావుగ

# శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి-

పేరుప్రఖ్యాతులుగల ధనవంతుని గూర్చి వినినవారు అనేకులు ఉండవచ్చును కాని స్వయముగ వెళ్ళి అతనిని దర్శించి, మాట్లాడినవారు చాల అరుదుగ ఉందురు అదే ప్రకారముగ ఆధ్యాత్మిక గ్రంధములను చదివి భగవంతుని గూర్చి పలుకువారు పెక్కుమంది ఉందురు. కాని వివేక వైరాగ్యాదులను కలిగి సాధన గావించి దైవానుభూతిని బడసిన మహనీయులు చాల కొద్దిమంది మాత్రమే ఉందురు కనుక జనులు పురాణములను, శాస్త్రములను చదువుట, వినుట యందే తృప్తినొందక, అందు తెలుపబడిన ప్రకారము ఆచరించుచు భగవద్దర్శనమునొంది జన్మ ధన్యము చేసుకొనవలెను.

ఒకడు అనేక తీర్థములను సేవించి, పుణ్యక్షేత్రములను దర్శించి, పెక్కు సంవత్సరములు తపస్సు, ధ్యానాదులను గావించియు తాను ఇంకను ఏ ఆధ్యాత్మిక లాభమును పొందలేదని పలుకుచుండును తీవ్ర వైరాగ్యము, దేవునిపై పూర్ణ భక్తి విశ్వాసములు లేనివానికి దైవదర్శనము కలుగుటకు కొంతకాలము పట్టును కావున, మానవుడు భగవంతునిపై అత్యంత ఆసక్తి, భక్తి, దృశ్యపదార్థములందు తీవ్ర వైరాగ్యము కలిగి, అచిరకాలములోనే దైవప్రాప్తియను గొప్ప ప్రయోజనమును బడయవలెను.

లౌకికులు దృశ్యవస్తు సంపాదనయందే తమ కాలమును గడుపుచుందురు కొందరు సంతానము లేదని, మరికొందరు సంపదలు లేవని చింతించుచుందురు కాని వివేకముగలవాడు దృశ్యవస్తువులు అశాశ్వతములని, ప్రాపంచిక సుఖములు క్షణికములని తెలుసుకొని శాశ్వత పరమాత్మ కొరకై కృషి సలుపుచుండును. భగవంతుని కొరకై తీవ్ర పరితాపమును, ఆసక్తిగలవాడు శీఘ్రముగ దైవసాక్షాత్కారమును పొంది శాశ్వతానందమును అనుభవించును.

(తరువాయి 24వ పేజీ)

# ఈశ్వర్

మంచిబుద్ధినే సన్మతి అందురు సన్మతి అనగా సద్బుద్ధి ఒక దేశము యొక్కగాని, ప్రపంచము యొక్కగాని, మానవుని యొక్కగాని శాంతి-సౌభాగ్యములు బుద్ధిమీదనే ఆధారపడియున్నవి. ఎన్ని సంపదలు, ప్రాపంచిక విద్యలు ఉన్నను బుద్ధి యొకటి సరిగా లేనిచో, బుద్ధి బూడిదపాలయినచో వినాశమే గతి

సముద్రము నుండి జలము ఆవిరియై మేఘరూపముగ పరిణామమొంది, వర్షించి నదులుగా మారి, నదుల నుండి చిన్న చిన్న కాలువలలో చేరి ప్రజోప యోగకరమగు విధముగనే పవిత్రమగు జీవశక్తి బుద్ధికి సంప్రాప్తమగుచున్నది. బుద్ధి నుండి ఈ శక్తి సమస్త ఇంద్రియములందు ప్రవేశించి తన్మూలమున వివిధములగు పరిణామములను కలిగించి ఆ పరిణామము లచే ఏర్పడు ఫలితములను జీవునిచే అనుభవింపజేయుచున్నది.

సంకల్పించిన ప్రతి విషయమును, బుద్ధి ఒక న్యాయాధిపతిగ వ్యవహరించి 'ఇది తగదు, ఇది తగును' అని నిశ్చయించును. ఈ నిశ్చయము సుప్రీం కోర్టు తీర్పువంటిది తిరుగులేనిది. దీని తీర్పును శిరసావహించి ఇంద్రియములు ఆ ప్రకారము వ్యవహరించుచుండును. కావుననే గీతాచార్యులు-

'అత్యంత నిర్మలమైన బుద్ధిగలవాడు మాత్రమే మోక్షమునకు అర్హుడగును' అని విశదీకరించియున్నారు.

అట్లే

'నా ప్రజలకు మంచి బుద్ధి నొసంగుడు' అని గాంధి మహాత్ముడు భగవానుని ప్రార్థించెను. బుద్ధిని సక్రమ మార్గమున, దైవమార్గమున త్రిప్పినచో మోక్షప్రాప్తియు సంభవించును.

నిర్మలబుద్ధి మోక్షము నొసంగ సమర్థమై యుండును. అట్లుకాక ఈ బుద్ధియే

కలుషితమై రాక్షసగుణయుక్తమై యున్నచో అది జీవుని నరకబాధకు కారణభూత మగుచున్నది.

మానవ జీవితము యొక్క సమస్త శక్తులకంటెను అత్యున్నతమై అనన్య ప్రభావోపేతమై యున్నది ప్రపంచమున వ్యాపించియున్న అగణితములగు విషయములందు సారభూతమగు సత్యమును గ్రహించవలయునన్నను, యుక్తాయుక్త విచక్షణ చేయవలయునన్నను, జనులకు శరణ్యము. మఱియు దూరదృష్టికిని, సత్య, ధర్మకార్యములొనరించుటకును, సచ్చింతనము, సత్సాంగత్యము, సద్విషయ ప్రసంగము, సద్గ్రంథ పఠనము, పవిత్రాచరణము, హితకార్యసేవనము మొదలుగాగల ఉన్నతాశయముల సంపాదనమునకును సర్వులకును అవసరమై యున్నది.

కావున అఖండ మహిమాన్వితమగు దైవశక్తిని అవగాహన చేసికొనవలయు నన్నచో, అత్యంత శక్తిస్తోమతలు గలిగియున్నట్టి అమూల్యమైన సంపాదించి ఈ జీవితమందే దైవసాక్షాత్కారము బడసిన వాని జన్మ సార్థకమగును- అందరము అట్టి స్థితికి ప్రయత్నించి సాధించెదముగాక! ⵔⵔ

---

4. గంగానదియందు కలుష పదార్థములు చేరుచున్నప్పటికి దాని పవిత్రతకు ఏ లోటున్ను లేదు. అదే విధముగ గొప్పవారియందు, మహాత్ములయందు కొన్ని లోపములు ఉన్నట్లు అజ్ఞానికి అగుపడినను, వారు అత్యంత నిర్మల హృదయ మును కలిగియున్నవారే యగుదురు. దైవానుభూతిని, ఆత్మానుభూతిని బడసిన వారు సర్వప్రాణులందు తమ ఆత్మను దర్శించుచు సర్వభూతదయ, ప్రేమ, కరుణ, ఉపకార స్వభావము కలిగి యుండుటచే వారివలన ఎవరికిని అపకారము కలుగజాలదు.
5. మాయ, అజ్ఞానము, అహంకారమువలననే జీవుడు భగవంతునికంటె వేరుగ ఉన్నట్లు తలంచుచున్నాడు. మహాత్ములనాశ్రయించి, పరమార్థ సాధనను ఆచ రించినచో కాలక్రమమున జ్ఞానోదయము కలిగి మనుజుని అజ్ఞానమంతయు నశించిపోవును. అపుడాతడు సాక్షాత్ భగవత్స్వరూపుడుగనే వెలుగొందును. ⵔⵔ

వేదాంతభేరి

# ప్రశ్నోత్తర వేదిక

## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.
(తిరుపతి)

**ప్రశ్న :** *సాత్త్విక,రాజస, తామస భేదంతో కర్తలు మూడు రకాలుగా ఉంటారు కదా! వారి స్వభావం ఎలా ఉంటుంది?*

**జవాబు :** కర్మసంగం లేకుండా, నేను చేస్తున్నాననే కర్తృత్వాభిమాని కాకుండా, స్థిరనిశ్చయంతో, మహోత్సాహంతో, కార్యం సిద్ధించినా, విఫలమైనా ఏమాత్రం వికారం లేకుండా సమానంగా స్వీకరిస్తూ కర్తవ్యభావనతో కర్మలు చేసేవాడు సాత్త్వికకర్త అవుతాడు.

రాగద్వేషాలకు లొంగిపోయినవాడు, కర్మఫలాన్ని పొందాలనుకునేవాడు, దురాశ కలవాడు, ఇతరులను హింసించే స్వభావంకలవాడు, కలుషితుడైనవాడు, సుఖ-దుఃఖాలకు బందీ అయినవాడు రాజసకర్త.

ఏ నీతినియమాలు లేనివాడు, వివేకరహితుడు, గర్విష్ఠి, వంచకుడు, ఇతరులకు మంచి కలుగకుండా చెడగొట్టేవాడు, బద్ధకస్తుడు, ఎప్పుడూ విచారపడేవాడు, ఎంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేనివాడు, తామసకర్త అని పిలువబడతాడు.

ముక్తసంగో౽నహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
[illegible] కర్తా సాత్త్విక ఉచ్యతే। (భగవద్గీత 18-26)
(26 నుండి 28 శ్లోకం వరకు)

**ప్రశ్న :** *మనకు సాత్త్విక-రాజస-తామస భేదంతో మూడు రకాల బుద్ధులు కలుగుతాయటకదా! అందులో దేన్ని సాత్త్వికమంటారు? దేన్ని రాజసమంటారు? తామస బుద్ధి ఎలా ఉంటుంది?*

**జవాబు :** దేనివల్ల మనకు లోకపు ప్రవృత్తి-నివృత్తి మార్గాలు, చేయదగిన పనులు,



శీలములేని వివేకము అపాయకరము.

విద్యయే మానవునకు సౌందర్యము. అది గుప్తధనము.

శ్రమించి పనిచేయువానికి అసాధ్యముకూడ సాధ్యమైపోవును.

మంచి పనికి మించిన పూజ లేదు. మానవత్వమును మించిన మతము లేదు.

ధర్మమును ఆచరించినచో, ఆ ధర్మమే మనుజుని కాపాడును. (ధర్మో రక్షతి రక్షితః)

మనస్సును స్వాధీనమందుంచుకొనువాడు ప్రపంచమును స్వాధీనపరచుకొనును.

ప్రాణముకంటెను మిక్కిలి ప్రియమైనది లోని ఆత్మ. ○○

చేయకూడని పనులు, భయపడవలసిన పదార్థాలు, నిర్భయంగా వుండవలసిన వస్తువులు, సంసారబంధం–దాన్నుంచి ముక్తి, వీటిని గురించిన తత్త్వం బోధపడుతుందో అది [illegible]

దేనివల్ల ధర్మాధర్మ స్వరూపం, కర్తవ్యా కర్తవ్య స్వరూపం, తాత్త్వికంగాగాక సందిగ్ధంగా తెలుస్తుందో అది [illegible]

ఏది అజ్ఞానావరణంవల్ల అధర్మాన్ని ధర్మంగా, ధర్మాన్ని అధర్మంగా, ఇలాగే లోకంలో వస్తువులను యథార్థంగాగాక భ్రమతో వేఱే విధంగా మనకు తెలియజేస్తుందో అదే [illegible]

కాబట్టి తామస–రాజస బుద్ధులను వదలి సాత్త్వికబుద్ధులు కలగడానికి ప్రయత్నించాలి.

[illegible]
[illegible] (భగవద్గీత 18–38)

○○



# వసిష్ఠవాణి



శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

సత్యాసత్య వివేకరహితుఁడగు బాలుఁడొకడు తన దాదిని ఒక మంచి కథ చెప్పుమని యడుగ, ఆమె ఇట్లు చెప్పదొడంగెను. అసత్తను నగరము కలదు. అందు ముగ్గురు రాజకుమారులు గలరు. వారిలో ఇద్దరింకను పుట్టనేలేదు. ఒకడు తల్లి గర్భమున నింకను ప్రవేశింపలేదు. ఒకప్పుడా నగరమున కరువు రాగా వారు ముగ్గురు మరియొక పట్టణమునకు బోవుచుండ త్రోవలో ఎండవేడిమిచే తపించుచుండ నట మూఁడు వృక్షములను జూచిరి. అందు రెండుత్పన్నము కాలేదు. ఒకదానికి బీజమే లేదు. అందొక చెట్టుక్రింద సేదదీర్చుకొని వాని ఫలముల భుజించి బయలుదేరిరి. మరల త్రోవలో మూడు నదులు కనుపించెను. అందొకటి బాగుగ శుష్కించిపోయినది. తక్కిన రెంటియందును నీరు లేదు. ఆ శుష్కించినదానియందు వారు స్నానముచేసి సాయంకాలమునకు భవిష్యన్నగరమునకు జేరిరి.

అచట మూఁడు భవనములు గలవు. వానిలో రెండింకను కట్టబడలేదు. ఒకదానికి గోడలే లేవు. గోడలే లేని భవనమున వారు ప్రవేశించిరి. అట మూడు బంగారు పాత్రలు గాంచిరి. అందు రెండు విరిగిపోయినవి. ఒకటి పొడి పొడి అయిపోయినది ఆ చూర్ణమైన పాత్రయందు నూఱు ద్రోణముల అన్నమును వండి ముగ్గురు బ్రాహ్మణులను బిలచిరి వారిలో ఇద్దరికి శరీరములే లేవు ఒకనికి ముఖము లేదు. ఆ ముఖములేని బ్రాహ్మణుడు ఆ నంద ద్రోణముల అన్నమును తినివేయగా మిగిలిన దానిని ఆ రాజకుమారులు ముగ్గురు తినిరి అనంతరము ఆ ముగ్గురు వేటకు

వెళ్ళి ఇప్పటికిని సుఖముగ నున్నారు!-ఈ కథ విని ఆ బాలుడు సంతోషించెను

ఓ రామచంద్రా! బాలకాఖ్యాయికవలెనే ఈ జగత్తు కల్పిత సంకల్పములచే ఈ ప్రకారము దృఢత్వము నొందియున్నది భవిష్యన్నగరమున ఆ రాజపుత్రుల యొక్క స్థితి యెట్లు సంకల్పరచనయై యున్నదో ఈ సంసార స్థితియు నంతియే. శరీరము నశించిన ఆత్మ నశింపదు. శరీరమునకెన్ని సుఖదుఃఖములు కలిగినను దానికి విలక్షణముగను వేఱుగనున్న ఆత్మకు ఏ హానియు లేదు. జగత్కల్పనయంతయు మనస్సువలననే కల్గినది. కావున ఆత్మనుగూర్చిన వివేకముద్వారా ఆ మనస్సును నశింపజేసిన మోక్షము లభించును.

కాబట్టి నీవు మనోనాశార్థము యత్నము సల్పుము మనస్సు సత్యమును అసత్యముగను, అసత్యమును సత్యముగను హ్రస్వకాలమును దీర్ఘకాలముగను, దీర్ఘకాలమును హ్రస్వకాలముగను దర్శింపజేయుచున్నది. జగత్సంబంధమగు ఇంద్ర జాలము చిత్తముయొక్క ఆధీనమై యున్నది. ○○

(21వ పేజీ తరువాయి)

ఉండెను. తక్షణమే తలారులు వేశ్యను విడిచిపెట్టి ఆ శిష్యునకు ఉరిత్రాడు తగిలించిరి. అపుడా శిష్యునకు సాధువుగారు బోధించిన విషయము స్మృతికి వచ్చి తన తప్పిదమునకు మిక్కిలి వ్యథనొందెను. మరుక్షణమున తలారులు రాజు గారి ఆజ్ఞను నెరవేర్చిరి.

నీతి : ఈ ప్రపంచము ఒక అజ్ఞాన [illegible]. ప్రస్తుతము అన్ని పరిస్థితులు [illegible] మలచుకొని [illegible] జన్మించిన మానవుడు మహోత్కృష్ట [illegible] తెలుసుకొని జీవితము [illegible] భగవంతుని ధ్యానించి, ఆత్మసాక్షాత్కారమును పడసి [illegible] వలెను. అనేక జన్మల నుండి జీవుని వెంటాడుచున్న అజ్ఞానమును సద్బోధద్వారా శాస్త్రపఠనముద్వారా, [illegible] పోగొట్టు కొని జనులు తమ హృదయములందు జ్ఞానజ్యోతిని వెలిగించి ఆత్మానుభూతిని పొంది తరించవలెను. ○○

# వీరిని గురించి తెలుసుకోండి

## కన్నప్ప

కన్నప్ప ఒక బోయవాడు. అతనికి తిన్నడు అను పేరు కూడ కలదు. ఒకనాడు అతడు వేటకై అడవికి వెళ్ళెను. అరణ్యమునగల ఒక శివలింగమును చూచి అతడు పరమేశ్వరునియందు భక్తిప్రపత్తులను పెంపొందింపజేసుకొనెను

ప్రతిదినము అతడు శివలింగమును శుభ్రముచేసి, భక్తితో నైవేద్యమును సమర్పించుచుండెను ఒక పర్యాయము శివునకు అభిషేకము చేసి, పుష్పములతో పూజించి, నైవేద్యము సమర్పించుచుండగా శివలింగమునకు గల ఒక నేత్రము నుండి ఏకధాటిగ నీరు గారుచుండెను అది గాంచి తిన్నడు తన పూజయందుగాని, లేక నైవేద్యమందుగాని ఏదైనా లోపమున్నదేమోనని చింతించసాగెను. కొంతసేపటికి అరణ్యములో తిరిగి మూలికలను తెచ్చి ఔషధమును తయారుచేసి శివుని కంటికి వేసెనుగాని నీరు కారుట తగ్గలేదు. శివుని కంటికి బదులు తన కంటినే అమర్చ దలంచి, తన కన్నును పెకలించి శివుని నేత్రస్థానములో అమర్చెను. పిదప రెండవ కన్ను కూడ నీరు గార్చుచుండుటను గమనించి, అచట తన పాదమును గుర్తుగ ఉంచి, తన రెండవ కంటిని కూడ పెకలించుటకు ఉద్యమించెను. మరుక్షణమే శివుడు ప్రత్యక్షమయ్యెను.

పరమేశ్వరుని అనుగ్రహమువలన కన్నప్ప భౌతిక నేత్రమును, జ్ఞాననేత్రమును బడసి, పరమశివుని అనేక రీతుల స్తోత్రము చేసెను. భగవంతుడు మిక్కిలి ప్రసన్నుడై కన్నప్ప యొక్క అభీష్టము ప్రకారము అతనిని తనయందు ఐక్యము చేసుకొనెను.

(మానవుడు తరించుటకు దైవభక్తి చాల అవసరము. దైవభక్తిని పెంపొందింపజేసికొనుచు, దైవము ఎడల అపారమగు శ్రద్ధాభక్తులు కలిగియుండుచు, భగవదనుగ్రహమునకు పాత్రుడై జీవుడు తరించవలెను).

కన్నప్ప వృత్తాంతము "శ్రీ కాళహస్తి స్థల పురాణము"నందు గలదు ○○

సూర్యుని చుట్టూ తిరుగు గ్రహములలో మూడవది భూమి. ఇది సూర్యుని నుండి దాదాపు 9 కోట్ల మైళ్ళ దూరమున కలదు.

2. బల్లికి తోక తెగినచో మరల పెరుగును. పీతకు కాలు విరిగినచో మరల ఏర్పడును.

3. సాలెపురుగులలో కొన్ని రకములు 5 సంవత్సరముల వరకు ఆహారము లేకుండ ఉండగలవు.

4. ఆంద్రోమెడా అను నక్షత్రముల గుంపు (గెలాక్సీ) భూమికి 2,200 కాంతి సంవత్సరముల దూరములో ఉన్నది. (కాంతి వేగము సెకనుకు 186 వేల మైళ్ళు.)

5. సముద్రములో 10,000 రకముల మొక్కలను శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

6. 1927 సంవత్సరం వరకు జీవించిన హాన్స్‌లాంగ్ సేత్ అను నార్వే దేశస్థుని గడ్డము పొడవు 17½ అడుగులు. అది అమెరికాలోని వాషింగ్టన్‌లో భద్రపరుపబడినది.

7. 1984 సంవత్సరమునాటికి అమెరికాలో 2 కోట్ల 60 లక్షల పెంపుడు కుక్కలు కలవు. OO

The whole universe serves one as his body when he feels the universal soul as his very self.

విశ్వాత్మను తన ఆత్మగా భావించువారికి విశ్వము తన శరీరముగా ఏర్పడును.

# శ్రీ నంబాళ్ళ బాలచంద్రుడు గారు (జియ్యన్నపేట)

సాధారణంగా మనుష్యులలో ఎక్కువమంది పూజలు, తీర్థయాత్రలు కోరికలు తీర్చుకొనుట కొరకు మాత్రమే చేస్తూ ఉంటారు. చాలామందికి కష్టాలు వచ్చేటప్పుడు మాత్రమే భగవంతుడు గుర్తువస్తాడు. అటువంటప్పుడు మాత్రమే ముడుపులు వెయ్యటము, మొక్కుబడులు చెల్లించడము చేస్తూ ఉంటారు. భగవంతుడు మనము ఏది కోరితే అదే ఇస్తాడు, ఏమీ కోరకుంటే అన్నీ సమకూరుస్తాడు. ఎందుకంటే? వారు మనందరికీ తండ్రికదా! బిడ్డలకు ఏమి కావాలో మనకంటే వారికే బాగా తెలుసు.

అసలు ముడుపులు, మొక్కుబడుల యొక్క రహస్యమేమిటంటే-ధనము గానీ, ఆస్తిగానీ, భగవంతునికి సమర్పించుకొనుటవలన అవి భగవంతుని పేర కొన్ని మంచి కార్యములు చేయటానికి ఉపయోగపడతాయి. ఈ విధముగా మనము పుణ్యకార్యము చేసినవారమవుతాము. అదే విధంగా తలనీలాలు ఇచ్చుకొనుట అంటే మనలో యున్న అహంకారము విడిచిపెట్టి మన యొక్క నిరాడంబరతను నిరూపించుకొనుటయే! గీతలో భగవానుడు "పత్రముగాని, పుష్పముగాని, ఫలముగానీ ఎవరైతే నాకు భక్తితో సమర్పిస్తారో వారే నాకు మిక్కిలి ఇష్టులు" అని చెప్పారుకదా! కావున మనము భక్తితో ఏదైనా భగవత్కార్యములు చేయాలి.

పూర్వము శ్రీ వివేకానందస్వామివారి కుటుంబము చాలా కష్టపరిస్థితులలో ఉన్నప్పుడు వారి గురుదేవుని ఆజ్ఞ ప్రకారము కాళికామాతవద్దకు పోయి తమ కుటుంబాన్ని కడతేర్చమని కోరుటకు వెళ్ళెనట. కానీ ఆయన మూడు పర్యాయములు ప్రయత్నించినప్పటికీ దేవి దివ్యసాన్నిధ్యమునకు వెళ్ళగానే ఈ లౌకిక విషయాలన్నియు మరచి-"అమ్మా! నాకు వివేక వైరాగ్యములను మాత్రమే కల్గించు తల్లీ!" అనే ప్రార్థించినారట. అదేమని ఆయనను అడిగితే మహారాజు వద్దకు వెళ్ళి కూరగాయలు గురించి అడిగినట్లుగా ఉంటుందని చెప్పారు ఆయన ఈ విషయమై

చక్కని కథ చెప్పారు.

ఒక పేదవాడొకప్పుడు ఒక దేవత అనుగ్రహమున మూడు వరాలు పొందె నట. వానిననుసరించి వాని కోరికలు సిద్ధింపవలెననిన కోరినప్పుడు పాచికలను దొరలించవలెను. ఆయనింటికి బోయి తన మహా అదృష్టము గూర్చి భార్యకు చెప్పి, "మన ఇద్దరి ముక్కులు అందవికారముగా ఉన్నవి లోకులు వానిని జూసి నవ్వుచున్నారు.

కావున మన ఇద్దరికి అందమయిన ముక్కులు కావలయును" అని పాచిక లను దొరలించెను. తక్షణమే వారి శరీరము అంతయూ చక్కని ముక్కులతో నిండియుండెను. కాని అవి వారికి పరమ అసహ్యముగా తోచి-"మహాప్రభో! మాకీ ముక్కులు తొలగుగాక!" అనుచు రెండవసారి పాచికలను దొరలించిరి.

వెంటనే వారిరువురికి ఇదివరకున్న ముక్కులు కూడా ఊడిపోయినవి. ముక్కులు పోయినందువలన వారు ఇదివరకటికంటె అసహ్యముగా కన్పించసాగిరి. "మూడు వరములు ఇచ్చినప్పటికి పరిస్థితులు చక్కబెట్టుకోలేని మూర్ఖులు అని లోకులు ఎక్కడ నవ్వి పోవుదురో" అని భావించి తమ యెప్పటి అందవికారపు పొట్టి ముక్కులు పొందుటకు పాచికలను దొరలించిరి. అందుకే మనము ప్రాపం చిక విషయములను వేనిని గోరకూడదు. దేనిని గోరుదుమో అదియే మనకు లభించును. దానితోబాటు ఘోర బంధము ప్రాప్తించును.

మన పూర్వజన్మ కర్మానుసారముగా సుఖ దుఃఖములుగాని, నిందాపనిందలు గాని సంభవించును. అందువలన మనము ధైర్యముగా ఉంటూ, ఆ భగవంతుని భక్తితో సేవిస్తూ, సత్కార్యములు చేస్తూ జ్ఞాన, వైరాగ్యాదులను అలవర్చుకొని మోక్షమును పొందవలెను. ఇంతకంటే ఉన్నతమైనది మరియేదియూ లేదు. OO

---

**Better to be raised than praised; mere praising is raising down.**

**మనుజుని పొగడుటకంటె ఏదో విధముగ వృద్ధినొందించుట మేలు, కేవలము పొగడుట ఆతనిని క్రిందికి త్రోయుటయే యగును.**

# వినోదము-వికాసము

## పాప పరిణామం

ప్రతి దేశమందును ఆ దేశాధిపతియగు రాజు కొన్ని శాసనాలను ఏర్పాటు చేసి రాజ్యాన్ని పరిపాలిస్తూంటాడు. ఆ శాసనాలను ఎవ్వరైన ధిక్కరిస్తే వారికి శిక్ష విధింపబడ్తూంది. ఆ శాసనాలకు అనుగుణంగ నడచినవారిని ఎవరును శిక్షింపరు. పైగా వారిని గౌరవిస్తారు. వారిని సత్పౌరులుగ పరిగణిస్తారు. ఆ రాజ్యంలో ఎవరికైనా శిక్ష విధింపబడి, శిక్ష అనుభవించేవాడు దుఃఖిస్తూంటే దుఃఖానికి కారణం రాజు కాదు, రక్షకభటులున్నూ కాదు, తాను చేసిన శాసనధిక్కారమే దుఃఖానికి కారణం.

అదే ప్రకారంగ విశ్వప్రభుత్వంలో కొన్ని శాసనాలున్నాయి. ఎవ్వరైనా పాపం చేస్తే దాని ఫలితంగ దుఃఖాన్ని అనుభవిస్తారు. పుణ్యంచేస్తే దాని ఫలితంగ సుఖాన్ని అనుభవిస్తారు. జ్ఞానం పొందితే దాని ఫలితంగ మోక్షం పొందుతారు. ఎవరు ఏ విత్తనం నాటితే వారు ఆ ఫలం అనుభవిస్తారు. ముష్టి విత్తనం నాటితే చేదు పండును, మామిడి విత్తనం నాటితే తీపి పండును జనులు పొందుతున్నారుగదా! ఒకరు అనుభవించే సుఖానికిగాని, దుఃఖానికిగాని కారణం భగవంతుడు కాదు, తాను చేసిన కర్మయే. ఇపుడు లోకంలో ఎందరో కుంటివారు, గ్రుడ్డివారు, అవిటివారు, రోగగ్రస్తులు కనుపిస్తున్నారుకదా! వారి దీన స్థితికి కారణం వారు చేసిన పాపకర్మయే. పాపం చేసినవానిని సంఘంగాని, సమాజం గాని గౌరవించదు. వారికి సంఘంలో ప్రముఖ స్థానం యుండనే యుండదు. వారు అగౌరవాన్ని పొందుతారు. ఎంతో దైన్యాన్ని అనుభవిస్తారు. పాపులు చనిపోయిన తరువాత వారి మాంసం తినటానికి నక్కలు, గ్రద్దలు వెనుకాడుతాయి అని ఒక కవీశ్వరుడు చమత్కారంగ చెప్పినాడు. ఇట్టి నికృష్ట స్థితిని పొందకుండ మానవుడు ప్రయత్నించాలి. ఇంతవరకు తాను చేసిన పాపకార్యాలకు పశ్చాత్తాపపడి ఇక క్రొత్త పాపాలను చేయకుండ చూడాలి. పుణ్యకార్యాలను ప్రయత్నపూర్వకంగా ఆచరిస్తూ మనస్సును నిర్మలమొనర్చుకోవాలి.

మానవ జీవితం చాల అమూల్యమైంది. జీవితకాలం చాల స్వల్పమైనది. ఈ

స్వల్పకాలంలో ఎన్నో సాధనలు చేయవలసియున్నది. కాబట్టి తరింపగోరువాడు ఇక ఏమాత్రము జాగుచేయక పాపభీతికలవాడై తన ఉన్నతికి భంగకరములైన కార్యాలేమీ చేయకుండ ప్రవర్తించాలి. పుణ్యకార్యాలను విరివిగ ఆచరిస్తూ అనవరతము భగవచ్చింతన గావించుకొనుచు పవిత్ర జీవితం గడపాలి. రాబోవు జన్మ మానవజన్మ వస్తుందని గ్యారంటీ లేదు

కాబట్టి ఈ సదవకాశమును వినియోగించుకొని జీవుడు తరించుటకై ప్రయత్నించాలి. దుమ్ము తుడిచిన అద్దమందే ముఖం చక్కగ గోచరించులాగున, నిర్మల హృదయమందే భగవత్సాక్షాత్కారము సంభవిస్తుంది కాబట్టి ముముక్షువులు, జిజ్ఞాసువులు కడు జాగరూకులై పాపము యొక్క దుష్పరిణామమును గుర్తుంచుకొని ధర్మ మార్గంలో ప్రవర్తిస్తూ భగవద్భక్తి కలిగి ఉత్తమ ఆచరణ కలవారై పరమశాంతిని పొందాలి. స్వస్వరూపానుభూతిని పొంది పరమానందమనుభవించాలి.

ఈ భావాలనే క్రింది శ్లోకము నిరూపించుచున్నది.

[illegible]
[illegible] హి తాదృశా ౦౦

జన్మభూమి [illegible]

**అపి స్వర్ణమయీ లంకా**
**న మే రోచతి లక్ష్మణ**
**జననీ జన్మభూమిశ్చ**
**స్వర్గాదపి గరీయసీ.**

**(ఈ వాక్యములను శ్రీరాముడు యుద్ధానంతరము లక్ష్మణునితో చెప్పెను—) లక్ష్మణా! ఈ లంకాప్రదేశము స్వర్ణమయమై ఉన్నప్పటికిని, నాకు దాని యెడల ఇష్టములేకున్నది. మాతృదేవి, మాతృదేశము స్వర్గము**

**(దీనికి మరియొక అర్థము కూడ చెప్పవచ్చును. జన్మభూమి ఆత్మ. ఈ దృశ్యప్రపంచము లంక. దృశ్యవైభవములు ఎంత గొప్పవిగా నున్నప్పటికిని ఆత్మకు సాటిరావు. ఆత్మ శాశ్వతము. దృశ్యసంపదలు అశాశ్వతములు.)**



**శిష్యుడు (శివప్రసాద్)** – మహాత్మా! గురుదేవా! బంధవిముక్తి కొరకై తమరు మూడు సాధనలు గూర్చి క్రిందటిసారి తెలిపియున్నారు అందు మొదటిదైన తత్త్వజ్ఞానాన్ని గూర్చి విపులంగ తెలియజేయ ప్రార్థన–తత్త్వజ్ఞాన, వాసనాక్షయ, మనోనాశములను ఈ మూడు సాధనలను చక్కగ ఆచరిస్తే జీవుడు ఈ సంసార చక్రం నుండి విముక్తుడౌతాడని తమరు సెలవిచ్చినప్పటి నుండి వాటిని గూర్చి వినాలనే ఆకాంక్ష నాలో ప్రబలిపోయింది. నా అభీష్టం నెరవేరే సమయం ఇపుడు ఆసన్నమైనందుకు హృదయంలో పరమానందం కలుగుతుంది. సాధనలో మొదటిదైన తత్త్వజ్ఞానాన్ని గూర్చి సెలవియ్యవేడెద.

**గురువు (ప్రబోధానందజీ మహరాజ్)** – నాయనా! శివప్రసాద్! బంధవిముక్తి కొరకై శాస్త్రాదులందు మహనీయులు తెలిపిన 3 సాధనలు గూర్చి ఒక్కొక్కటిగ వివరించి చెప్పెదను సావధానంగ విను. ఈ మహెూన్నత సాధనత్రయాన్ని గూర్చి ఉపనిషత్తులందు, యోగవాసిష్ఠాది గ్రంథరాజములందు చక్కగ తెలుపబడియున్నది. శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు బాల్యకాలమున ఈ సాధనత్రయాన్ని గూర్చి వివరంగ చెప్పియున్నారు. ఈ తత్త్వజ్ఞానాది సాధనలు మూడును పరస్పరమొక దానిపై ఒకటి ఆధారపడియున్నందున సాధకుడు ఆ మూడిటిని గూర్చి చక్కగ తెలుసుకొని అన్నిటిని ఆచరణయందుంచాలి. ఇక ఇపుడు తత్త్వబోధ అను మొదటి సాధన గూర్చి తెలుసుకొందాం.

ఈ ప్రపంచంలో ఆత్మ, అనాత్మ ; దృక్కు, దృశ్యము ; క్షేత్రజ్ఞుడు, క్షేత్రము, చైతన్యము, జడము–అను రెండు వస్తువులు కలవు. వాటిలో అనాత్మవస్తువు వాస్తవముగ లేనిదే–అది కల్పితమైనది. అది ప్రతిబింబమువంటిది మాత్రమే. అద్దములో కనుపించు ప్రతిబింబము వాస్తవముగ సత్యంకాదు. స్వప్నంలో ఎన్నియో

భవనాలు, వృక్షాలు, నదులు, ప్రాణులు కనుపించినను అవి సత్యాలు కావు అట్లే ఈ దృశ్యజగత్తంతయు మనస్సువల్ల ఏర్పడింది మాత్రమే యగును మనస్సు లయమైనపుడు ఈ దృశ్యం కూడా లయించిపోతుంది. వాస్తవంగ మనస్సుకు అస్తిత్వము లేదు. అది అనాత్మవర్గంలో చేరింది. ఆత్మ ఒక్కటే సత్యమైంది అది త్రికాలము లందును అస్తిత్వం కలిగి యుంటుంది. జగత్తు అట్లాకాదు. అది మనసు యొక్క అస్తిత్వంపై ఆధారపడి యుంటుంది. ఏది త్రికాలములందును యుండదో అది సత్యము కాదు. ఈ జగత్తు సృష్టికి పూర్వం లేదు ప్రళయానంతరము యుండదు. మధ్యలో కొంత కాలం మాత్రమే కనుపించే ఈ దృశ్యం సత్యమెట్లా ఔతుంది? కనుకనే అనుభవజ్ఞులను మహాత్ములు శాస్త్రాలందు "బ్రహ్మసత్యం, జగన్మిథ్యా" అని స్పష్టంగ పేర్కొనియున్నారు.

రాత్రి చీకటిలో త్రాడును చూచి కొందరు పామని భ్రమిస్తూంటారు. పాము వాస్తవంగ లేదు. త్రాడు మాత్రమే త్రికాలములందును సత్యం. పాము యథార్థంగా త్రాడే అయియున్నది. అట్లే ఈ దృశ్యజగత్తంతయు బ్రహ్మమయమై, ఆత్మమయమై విలసిల్లుతూంది. ఆత్మతప్ప రెండవ వస్తువు ఇచట లేనేలేదు. కావున జీవుడు తాను దేహస్వరూపుడు కాదనియు, మనోరూపుడు కాదనియు, ఇంద్రియ రూపుడు కాదనియు లెస్సగ తెలుసుకొని తాను వాస్తవంగ ఆత్మస్వరూపుడే అని నిశ్చయించి అట్టి ఆత్మయందు నిలకడ కలిగియుండాలి. ఈ ప్రకారంగా స్వస్వరూపమైన ఆత్మలో స్థిరప్రతిష్ఠ కలిగినవానికి లభించు ఆనందం వర్ణనాతీతం. అట్టి సచ్చిదానందాన్ని అనుభవించటమే జీవితలక్ష్యం. అట్టి ఆత్మానాత్మ వివేకం కలిగి యుండటమే తత్త్వబోధ యొక్క మహాప్రయోజనం.

శివప్రసాద్! ఇట్టి తత్త్వజ్ఞానం పొందటానికై నీవు చక్కగ సాధనలు మొదలుపెట్టు. శాస్త్రవిచారణ చేయి. మహాత్ముల సాంగత్యంకలిగియుండు. శివోఽహం, బ్రహ్మైవాస్మి, ఆనందం బ్రహ్మ అను మంత్రాలను ఎలుగెత్తి పాడుతూండు. ఈ ప్రపంచంలో తత్త్వజ్ఞానాన్ని మించిన ధనం వేరొకటి లేదు. అద్దానిని ప్రయత్నపూర్వకంగ సంపాదించి కృతార్థుడవుకా. జన్మను సఫలం చేసుకో.

**శిష్యుడు —** స్వామీ! గురుదేవా! ఆధ్యాత్మిక సాధనలలో శిరోమణియైన తత్త్వజ్ఞానాన్ని గూర్చి తమరు బోధించినది వింటూంటే నాకెంతో పరమానందం కలుగుతూంది. నా జన్మ ధన్యమైందని భావిస్తున్నాను. మహాత్మా! తక్కిన రెండు సాధనలను గూర్చి కూడ తమ ముఖతః తెలుసుకొని ఆచరించి తరించాలని కుతూహలంగా యుంది. సెలవు.

OO

# శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | గీతామకరందము | 75.00 |
| 2. | GITA MAKARANDA | 75.00 |
| 3. | యోగవాసిష్ఠ రత్నాకరము | 65.00 |
| 4. | రామాయణ రత్నాకరము | 50.00 |
| 5. | భారత రత్నాకరము | 60.00 |
| 6. | భాగవత రత్నాకరము | 50.00 |
| 7. | ఉపనిషద్రత్నాకరము | 40.00 |
| 8. | గీతోపన్యాసములు | 30.00 |
| 9. | మోక్షసాధన రహస్యము | 30.00 |
| 10. | పరమార్థ కథలు | 30.00 |
| 11. | బ్రహ్మచర్య విజయము | 30.00 |
| 12. | ఆధ్యాత్మ రామాయణము | 15.00 |
| 13. | ఆత్మానుసంధానము | 15.00 |
| 14. | బ్రహ్మానంద వైభవము | 15.00 |
| 15. | శ్రీ వాసిష్ఠ మహారామాయణము | 15.00 |
| 16. | శ్రీ మలయాళ మహర్షి | 10.00 |
| 17. | భజన కీర్తనలు | 15.00 |
| 18. | అమృతబిందువులు | 15.00 |
| 19. | శ్రీమద్భగవద్గీత (స్థూలాక్షరి) | 15.00 |
| 20. | శ్రీమద్భగవద్గీత (మూలం) | 5.00 |
| 21. | వివేకానంద సింహనాదము | 16.00 |
| 22. | యమలోక వార్తలు | 4.00 |
| 23. | శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశా నందగిరి స్వాముల జీవిత చరిత్ర | 25.00 |
| 24. | తత్త్వసారము | 3.00 |
| 25. | మానసబోధ | 3.00 |
| 26. | పాండవ గీత | 3.00 |
| 27. | ఆధ్యాత్మ జడ్జిమెంటు | 3.00 |
| 28. | ధ్యాన పద్ధతి | 2.00 |
| 29. | వైరాగ్య సాధన | 2.00 |
| 30. | మట్టిలో మాణిక్యము | 2.00 |
| 31. | ప్రణవ పూజ | 2.00 |
| 32. | గౌరీ పూజావిధానము | 2.00 |
| 33. | ద్వాదశమంజరి | 2.00 |
| 34. | మోక్షద్వారపాలకులు | 2.00 |
| 35. | ఆత్మతత్త్వవిచారణ | 2.00 |
| 36. | ఆధ్యాత్మిక హితోక్తులు | 2.00 |
| 37. | దివ్యసూక్తులు | 7.00 |
| 38. | గీతా దినచర్య డైరీ–1993 | 25.00 |

## ఆడియో కేసెట్లు

రు.

1. శ్రీ స్వాములవారి గీతోపన్యాసములు (కేసెట్ 1 అధ్యాయం) 35.00

(18 అధ్యాయముల 18 కేసెట్లు, సెట్ కలదు. మొత్తము సెట్–రూ.630/–)

| | రు. |
|---|---|
| 2. తత్వసారము | 35.00 |
| 3. మానసబోధ | 35.00 |
| 4. తత్వగీత | 35.00 |
| 5. యతిగీత | 35.00 |

| | |
|---|---|
| 1. శ్రీ స్వాములవారి గీతోపన్యాసములు ఒక అధ్యాయము గల ఒక వీడియో కేసెట్ వెల | 150.00 |

| | |
|---|---|
| వేదాంతభేరి సంవత్సర చందా | 30.00 |
| శాశ్వతచందా | 300.00 |

(పోస్టేజి ప్రత్యేకము)

గ్రంథములు కావలసినవారు ఈ క్రింది చిరునామాకు వ్రాయవలెను.

మేనేజరు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ శుకబ్రహ్మాశ్రమము పోస్టు, శ్రీకాళహస్తి–517 640

చిత్తూరు జిల్లా ఫోన్స్ : 2543, 2239

Even the least work alone for others awakens the power within.

ఇతరుల అభ్యున్నతికై చేయబడు స్వల్పకార్యమైనను లోని శక్తిని మేలుకొల్పును.

To succeed one must have tremendous perseverance and tremendous will.

కార్యసాఫల్యమునకు గొప్ప పట్టుదల, అకుంఠితమగు దృఢనిశ్చయము కలిగియుండవలెను.

## వేదాంతభేరి శాశ్వతే

**వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :**

1. శ్రీమతి పి.ఎస్. లక్ష్మీదేవి గారు – హైదరాబాద్
2. శ్రీ బి. కృష్ణప్రసాద్ గారు – హైదరాబాద్
3. శ్రీ వి.పి. శశికళ గారు – హైదరాబాద్
4. శ్రీ వి. నర్సయ్య మంథన్ గారు – బొంబాయి
5. శ్రీ ఎస్. రామకృష్ణారావు గారు – విశాఖపట్నం
6. శ్రీ ఎన్. ధనలక్ష్మి గారు – జడ్చర్ల
7. శ్రీ ఆర్.టి. దేవర గారు – గునర్తి
8. శ్రీ జూటూరి శంకరయ్య గారు – ప్రొద్దుటూరు
9. శ్రీ ఐ. బాలరాజు గారు – హైదరాబాద్
10. శ్రీ సి. వీరన్న యాదవ్ గారు
11. శ్రీ కె.వి.ఎన్.ఎన్. సత్యనారాయణరాజు గారు – తాడేపల్లిగూడెం
12. శ్రీ యు. రాములు గారు – తాండూరు
13. శ్రీ కె. కృష్ణమూర్తి గారు – అంకంపాలెం (E.G) ○○

## వినాయక ఉవాచ

**నారాయణేతి మంత్రేణ చతురక్షర్యహర్నిశమ్**
**యన్మనో విలయం యాతి తస్య విష్ణోః పరంపదమ్.**

'నారాయణ' అను నాలుగక్షరముల మంత్రమును నిరంతరము జపించుచు ఎవనియొక్క మనస్సు విలయమొందునో, ఆతనికి విష్ణుభగవానుని మహోన్నత పదము సంప్రాప్తించును.







శ్రీ కాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు కంటి ఆస్పత్రి ప్రారంభింపబడి రెండు మాసములే అయినను చక్కటి ప్రగతిని సాధించినది. చిత్తూరులోని జిల్లా గవర్నమెంటు ఆసుపత్రిలో సూపరింటెండెంటుగా పనిచేసి రిటైరయిన శ్రీ ఎమ్.ఎస్. రామకృష్ణారావుగారు ఈ ఆస్పత్రిలో డాక్టరుగ పనిచేయుచున్నారు. కంటి వైద్యములో వారు గొప్ప అనుభవజ్ఞులు (Eye Specialist) వారు దైవభక్తి పరాయణులు మరియు అనేక నేత్రచికిత్సా శిబిరములను (Eye Camps) నిర్వహించినవారు.

ఈ రెండు మాసములలో ఈ ఆసుపత్రియందు ఇప్పటికి 120 ఆపరేషన్లు కావింపబడినవి. మరియు 1,850 మంది (Out Patients) రోగులకు చికిత్స కావింపబడినది. ఆపరేషను చేయించుకొనినవారికి ఉచితముగ భోజన సౌకర్యము ఏర్పాటుచేయబడినది. వారికి కంటి అద్దములు కూడా ఉచితముగ ఒసంగబడినవి.

భగవత్కృపచేత ఈ ఆసుపత్రి భవిష్యత్కాలమున ఇంకను గొప్ప ప్రగతిని సాధించగలదని విశ్వసించుచున్నాము.

ఇట్లు

కార్యదర్శి

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada

**Editor : B. ESWAR**

# పాతంజల యోగసూత్రములు 1-14

(సంగ్రహము)

## సతు దీర్ఘకాలనైరన్తర్య సత్కారాసేవితో దృఢభూమిః

**తా॥ మనోనిగ్రహమును బహుకాలము నిరంతరము శ్రద్ధతో ఆచరించినచో అయ్యది దృఢపడగలదు.**

వ్యాఖ్య : 12వ సూత్రము నందు అభ్యాసవైరాగ్యముల ద్వారా మనోనిగ్రహము సాధ్యపడగలదని పతంజలి మహర్షి నుడివియున్నారు. ఇక ఆ అభ్యాసమన నెట్టిదో ఈ 14వ సూత్రమునందు వివరముగ తెలిపినారు.

ఏ కార్యమైనను పదే పదే ఆచరించుచు వచ్చినచో పూర్ణత్వమును పొందగలదు. విద్యార్థి పాఠమును పదే పదే వల్లించినచో కంఠస్థము కాగలదు. అట్లే అనేకజన్మలనుండి మనస్సులో పేరుకొనియున్న దుష్టప్రవృత్తులు, దృశ్యవాసనలు బహుకాలాభ్యాసముచే తొలగి మనస్సునందు పవిత్రత ఏర్పడగలదు. పై సూత్రమునందు మనోనిగ్రహము చక్కగ సిద్ధించుటకు పతంజలి మహర్షి మూడు విశేషణములను తెలిపియున్నారు.

1) అభ్యాసమును దీర్ఘకాలమాచరింపవలెను.

2) నిరంతరము కొనసాగించుచుండవలెను.

3) శ్రద్ధతో గావింపవలెను. శ్రద్ధా విశ్వాసములతో కూడినపుడే కార్యము సఫలమగును.

కాబట్టి ముముక్షువులు బహిర్ముఖచిత్తవృత్తులను వివేక వైరాగ్యాదుల సహాయముచే నిరోధించి, అభ్యాసమును శ్రద్ధతో బహుకాలము ఆచరించి, మనస్సును నిర్మలమొనర్చుకొని, అంతర్ముఖమొనర్చి, ఆత్మయందు స్థాపించి పరమశాంతిని బడయుదురుగాక!

ఓం

---